# తృష్ణావర్తము

బోడేపూడి వేంకటరావు



# మున్నుడి

జగద్విఖ్యాత రచయితయై తత్త్వవేత్తయైన టాల్‌స్టాయి వ్రాసిన 'మానవుడెంత భూమి నాక్రమించును' 'How much land does a man need?' అను కథ ఈ కృతి కాధారము. అయ్యు దాని కిది అనువాదమూ కాదు, అనుకరణమునూ గాదు, కథాగమనమున క్రొత్తదనము సంతరించికొని భావచిత్రణమున సంపూర్ణస్వాతంత్ర్య మందుకొన్న యీ కృతి స్వతంత్రకావ్య మనఁదగును. ఇందలి గుణదోష నిర్ణయమున సహృదయ హృదయములు నిదర్శనములు.

ఆశావశుఁడైన మానవుఁడు తృప్తి యెఱుఁగక లోకము నెల్ల నాక్రమింపఁ జూచుచున్నాఁడు. అతని యాశ త్రివిక్రముని వలె విజృంభించి ఖండాంతరములకే కాక గ్రహాంతరములకుఁ గూడ నెగఁబ్రాక నుంకించుచున్నది. మానవుఁడు తన విజ్ఞాన మహిమను, తన పరిశీలనాశక్తిని లోకకళ్యాణమునకు గాక లోక వినాశకములగు మారణాస్త్రనిర్మాణమున కుపయోగించు చున్నాడు. వానిమూలమున తా నేమేమియో సాధింపవలెనని గాలిమేడలు గట్టుచున్నాఁడు. తృష్ణాతురుడై తుదకుఁ దాను నిర్మించిన మారణాస్త్రములకు తానే గుఱి యగుచున్నాఁడు. దీన సుఖములేదు, దివ్యశాంతియు లేదు. కాఁగా మానవజాతి తృప్తిపథమునఁ బయనించి " లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"

అను మంత్రమును జపింపఁగలిగిననాఁడే మహాత్ము లాశించిన విశ్వశాంతి, విశ్వకళ్యాణము చేకూరఁగల దను దివ్యసందేశమున కీ కావ్యము ప్రతీకప్రాయము. ఆ విషయమున దాని విజయమును నిర్ణయించు తీర్పరి కాలము.

'కాంతా సమ్మితతయోపదేశయుజే'

ప్లవంగ
వసంతము

ఇట్లు
కృతికర్త



శ్రీయుతులు డాక్టరు కె. సదాశివరావుగారు,
M. S.



శ్రీమతి డాక్టరు జయప్రదాంబగారు,
M. B., B. S.

కృతి

భూయా న్నిరంతరమహోదయమంగళశ్రీ
ర్భూయా త్సర్వధర్మకలనోన్నతకౌశలశ్రీః
భూయా ద్విపశ్చిదభినందితసత్కలాశ్రీ
శ్రీమన్ ! సదాశివభిషఙ్మణి ! నిత్యశో వః

[illegible]

*

శ్రితవత్సల ! మహితగుణో
న్నత ! అగదంకారలోకనైకవిధప్ర
స్తుతిపాత్ర ! లోకచణ ! సం
తతకావ్యవినోద ! శ్రీ సదాశివరాయా !

స్మితపూర్వముగ సుధాసేచనోత్సవముగ
మాటలాడఁగ నేర్చు మధురిమంబు
పెద్దలగరిమంబు పిన్నలపెరిమంబు
గణియింపఁజాలిన గడుసుఁదనము
ఆంగ్లభాషారూఢి నాంధ్రభాషాప్రౌఢిఁ
జెంది మోదించు రాసిక్యగరిమ
భోగభాగ్యస్థితి త్యాగశీలోన్నతి
కడఁదాఁక నెఱిఁగిన గఱగఱికయు
నేకమై ప్రోదిగాంచి నా హృదయసీమఁ
బాదుకొల్పిన గౌరవభావమేదొ
యీ చిరుతకబ్బమున్ మీకుఁ గృతినొసంగఁ
బ్రీతిపూర్వంబు నన్నుఁ బ్రేరేచునయ్య !

రాజనరేంద్రధరాజానికోర్కిమై
నన్నయ్య పంచమామ్నాయ మొసఁగె
హరిహరనాయకుం డర్థియై గల వచ్చి
తిక్కన్నకృతికి నేతృత్వ మెనసె
మామిడి సింగనామాత్యుఁ డభ్యర్థింప
నైషధం బొసఁగె శ్రీనాథభట్టు
కృష్ణరాయఁడు తనకేలఁ బల్లకి నెత్తి
మనుచరిత్రం బందుకొనియెఁ గృతిగ

నాఁటినుండియు మఱియు నీనాఁటిదనుక
సాగివచ్చిన ప్రత్న మాచార మిద్ది
అడుగకయ మీకుఁ గృతి నీయ నభిమతంబు
గలిగినది దాని కిది రూపకల్పనంబు.

అడుగని యీవి లాఘవగు
ణాస్పద మందురు పెద్ద లైన నా
యెడఁద నొకించుకేని స్పృశి
యింపవు గౌరవ లాఘవ స్థితుల్
ఎడపని భావబంధ మది
యేమొ యతర్కిత హేతుబంధమై
యడుగర గాఁగఁ గబ్బ మిడ
నుత్సుకముం బొనరించుఁ జిత్తమున్.

పితలకుఁ గాన్కఁగా నిడితిఁ
బేరిమి మీఱఁగ నాంధ్రతేజ మన్
కృతి నది దొట్టి నేటిసుత
గీల్కొనఁబోద కృతిప్రదానసం
గతి మది నేఁటి కీ సరణిఁ
గాంతు యొకండు మహాత్మబుద్ధ సం
గతమయి యీ కృతిన్ నెఱపఁ
గా నెనకొల్పు నిరంతరాయమై.

ఇది గుణ మిద్ది దోష మిది
హృద్యము నీరస మిద్ది భావనా
స్పద మిది భావనారహిత
శబ్దమయం బిది యంచుఁ గావ్య సం
పద గణియించు నేర్పుగల
ప్రాజ్ఞులకుం గృతియిచ్చి కాంచు స
మ్మదమునకన్న సత్కవికి
మాన్యతమం బొకవాంఛ యున్నదే !

ఆకృతిని జిన్నయయ్యు గుణాధిరూఢ
మైన కబ్బంబు రసికలోకాదృతిఁ గనుఁ
గావ్య గుణదోషముల పరిగణనమందు
రసికజనమానసములు తార్కాణములగు.

దీవ్యదుదారబంధ పరి
దీప్త వినూతనభావకల్పనా
భవ్యము లౌచితీగరిమ
భాసురముల్ రసలుబ్ధలోకసం
భావ్యసముజ్జ్వలద్రుచిర
పాకములై దనరారు సత్కృతుల్
కావ్య పదానువాచ్యములు
గౌరవభాజనముల్ వసుంధరన్

సర్వథా మీదు సహధర్మచరిత నెనసి
యశము నార్జించుకొన్న జయప్రదాంబ
యీ కృతిన్ గ్రహియించు సత్కృతినిగూడ
నాఁచికొనుఁగాత సాహచర్యంబు నియతి.

మీ కాయుష్యము మీ కనామయ మగున్
మీ కబ్బుతన్ భోగభా
గ్యైకప్రాభవ సర్వతోముఖజయ
ప్రాప్తుల్ సదుద్యోగ సు
శ్రీకల్యాణ పరంపరాలసిత వ
ర్థిష్ణుక్రియాశీలసు
శ్లోకుల్ గావుత మీ తనూజులు, యశ
శ్శోభావహుల్ మీ కగున్.

కడ యనఁగ లేని మృగతృష్ణికాప్రవాహ
మాసలను బెంచి మృగకోటి నాహరించుఁ
పార మెఱుఁగని తృష్ణాప్రవాహ మేఁచి
యాఁచికొను మానవుల నడియాస రేఁచి,

*       *       *       *       *       *

యన్మహామహిమము నిర్మలాంబరమున
విమలవిద్యుత్సహస్రదీపికల మెలపు
ఖరకిరణుతీవ్రదీధితికాండములను
మధురమధురాంబువులు గ్రోల మనసుగొలుపు.

ఏ మహాశక్తిపనుపున నీ జగంబు
శాంతి యెఱుఁగక సుంత విశ్రాంతి గనక
అహరహం బన్యపీడనాయత్త మగుచు
భయదపైశాచికక్రియాప్రౌఢి నెనయు.

ఏ పరాశక్తి మహితనిరీక్షణమునఁ
గాఱుచీఁకటిలో వెల్గు గానుపించుఁ
గాలకూటాబ్ధిలో సుధాకణము లొలయు
నర్కుఁ డుదయించుఁ బశ్చిమాశాంతమందు.

అజ్ఞాతామూర్తి శాస్త్రరహస్యవేది
నృపుఁడు నిఱుపేద బాలుండు వృద్ధుఁడనక
ఏ మహాశక్తి పూజారతైకమతులు
ఆ మహాశక్తి కాశకు నర్పనంబు.

కనకగిరిలబ్ధి యొకమాషకల్పకంబు
సర్వలోకాధిపత్యంబు స్వల్పమాత్ర
కదనరంగంబు సుఖశయ్యగాఁగఁ జూపు
నైంద్రజాలికశక్తి కనంతజయము.

ఆశల జయించు మహితసత్వాభినుతులు
అరుల నుఱుమాడనేర్చు ధీరాగ్రసరులుఁ
గ్రీడనీయకములుగాఁగఁ గేరియాడు
నఖిలవిజయిష్ణువగు తృష్ణ కస్తు మహము.

* * * * * *

## ప్రవేశిక

శ్రీమంతమై కళాక్షేత్రమై సౌఖ్య
ధామమై తేజఃప్రధానమై మించి
హైందవావనికి ధాన్యాగార మనఁగఁ
బాఁడిపంటలకు నావాసంబనంగఁ
గలుముల తల్లికిఁ గాణాచి యనఁగఁ
బేరు పెంపులు గన్న భూరిగుణాఢ్య
గౌతమి కృష్ణ తుంగయు భద్ర పెన్న
చల్లని తల్లులై సాకిన నేల
అన్నదానంబున నన్యరాష్ట్రములఁ
బోషింపఁజాలిన పుణ్యధరిత్రి
అనఁగఁ జెన్నొందు నాంధ్రావనియందు
శ్రీమించు గుంటూరిసీమలో నొక్క
గ్రామంబు సౌభాగ్యధామంబు గలదు.

దేవమాతృకలు నదీమాతృకములు
భూము లా పీటను ముక్కారుఁ బండుఁ
గరిసనమునఁ బశుగణపోషణమున
నెన్నికగాంచి సంపన్నులై మించు
కర్షకావళులకుఁ గాణాచి యద్ది
కష్టించి పండించి గడియించి సుఖము
లనుభవింపఁగలార లచటి సైరికులు.

కలఁ డట నొక కృషీవలసత్తముండు
కట్టను గుడుపను గలపాటి గేస్తు
ఇంచుమించుగ నల్వదేఁడులవాఁడు
చదువుకొన్నాఁడు శాస్త్రరహస్యవేది
లోకం బెఱుఁగు మాటలో నేర్పుగలదు
కర్షకవిద్యల గడుసరి యతఁడు
భూమిచేవ గణించు మొనగాఁ డతండు
ఏనేల ఏకాల మేవిత్తనంబు
ఏదోహదం బన్న దెల్లను నేర్చు
సస్యలతమ్మలకు సుస్వాగతం బొసఁగి
ఫలము నందఁగ నేర్చు ప్రౌఢిమ గలఁడు

భాగ్యంబునందు విశ్వాసంబు నుండు
భగవత్కటాక్షంబుపై నాస్థ మెండు
అన్నిటికిని మిన్న యాత్మ పౌరుషము
గా జీవితపథాన గమియించు నతఁడు.

ఉన్నంతలోఁ దుష్టి నొందుటయన్న
దాతని కోశమునందున సున్న
ఆయతికై సదా యఃబ్జులు సాఁచు
నుత్సాహశాలి మహోద్యోగశీలి
సారవంతములు విస్తారంబులైన
భూము లసంఖ్యాకముఁగ సమకూర్చి
బహువిధ సస్యసంపదలఁ బోషించి
పండింప సంబరపడుచుండు నెపుడు.

ఎన్నినాళ్లకుఁ దనయున్న యచ్చోటఁ
గాంతుల కొక రూపకల్పన సేయ
నణుమాత్ర మవకాశమన్నది లేక
కోర్కులు కోర్కులై కొనసాగుచుండఁ
గాలంబు నట్టులే గడపు నతండు.

చన్నవి యెన్నొ వసంతంబు లిటుల
నంతట నొక్క సాయాహ్నంబునందు
వృద్ధుఁ డొక్కఁడు డెబ్బదేఁడులవాఁడు
బహుళ లోకజ్ఞతాప్రాభవోన్నతుఁడు
ఇంగితజ్ఞుఁడు వాక్ప్రసంగైకచణుఁడు
ఏపరాశక్తి ప్రేరేపణంబుననో
అతిథియై వచ్చినాఁ డా గేస్తుకడకు.

కర్షకుం డతిమాత్రగౌరవం బెసఁగ
నభ్యాగతునకు సుస్వాగతం బొసఁగి
ఆదరణమున మర్యాద గావించి
అన్నపానాదుల నర్పించె నెలమి.

భోజనానంతరమున ముదుకండు
విశ్రాంతి గొనుచున్నవేళఁ గుటుంబి
దరిఁజేరి కూర్చుండి తరితీపు నెఱపి
ఆగంతుకునివార్త లరయంగఁ దొడఁగె.

వృద్ధుండు చతురవాగ్విలసనం బొలయఁ
దనపేరు తనతీరు తనపుట్టుచోటు
ఆలుబిడ్డలవార్త లన్నియుఁ దెలిపి

తనకన్న విన్న యర్థంబు లెన్నిటినో
కథలుగా గాథలుగా నుగ్గడించి
అతిథేయుని మన మలరంగఁ జేసె.

ఆతనిమాటల కలరుచు గేస్తు
చాలసే పేవో ప్రసంగముల్ నెఱపి
మాటలధోరణి మదిలోన మెదలు
తన వాంఛితంబు నాతని కెఱిఁగించి
గొంతెమకోరికల్ గోరెద నివ్వి
తీరునా ? యనుచు నిట్టూరుపు విడిచె.

వృద్ధుఁ డాతనిమాట విని యుత్సహించి
నగవు చిమ్మెడు మొగ మెగయించి పలికె;
కలదయ్యా నీ కోర్కు లెలనెడు తీరు
యత్నంబున నసాధ్యమన్నది యున్నె ?
మనవసించెడు తెల్గు మాగాణమునకు
దరిదాపు పశ్చిమోత్తరభాగమందు
జయపుర మనఁగ సంస్థానంబు గలదు
ఆ ప్రాంత మెల్ల మహాటవీమయము
ఎన్నిక కగు భూము లున్న వచోట
సారతమ క్షేత్రజాతముల్ గలవు
పండింపఁగల నాథుఁ డుండిననాఁడు
బంగారు పంటలు పొంగారు నచట.

కోయల నొక్కింత కూర్చుకోఁగనినఁ
గోరిన భూమి చేకూర్చుకోఁ గలుగు
యత్నింపుమా సిద్ధి నందంగఁజాలు
దని రాకపోకల కైన మార్గములు
నచ్చటి మెలఁకువ కైన పద్ధతులు
వివరించి శయనించి వేగంగ నతఁడు
వీడ్కోలు వడసి తా వెడలె నెచ్చటికో.

స్థవిరుని నొడులు చిత్తంబునఁ దవిలి
తీయని తలఁపులై తీవరింపంగ
భావి సంపాద్యముల్ భవ్యక్షేత్రములు
బంగారుపంటలుం బవలును రేలు
మధురతరస్వప్నమయములై తోఁప
నిరతకార్యారంభనిభృతమై చిత్త
మనునిమేషంబును నారాటమందఁ
గతిపయతిథు లట్టె గడపిన యంత

ఎట్టకేలకు ధైర్య మెఁడదఁ గీలించి
పయనమ్ము కైన నిశ్చయము గావించి
తారాబలమ్ముఁ జంద్రబలమ్ము నెంచి
తిథి వార నక్షత్ర దివ్యయోగముగ

మంచి ముహూర్తమ్ము మఱి నిశ్చయించి
వలసిన సంభారములు సేకరించి
ఆలుబిడ్డల బాంధవావళి వీడి
వెంటని దీక్షయే జంటయై నడవ
వాడని తలఁపులు తోడునీడలుగ
వొక్కండు సత్తువ యున్నకొలంది
పవలును రాతిరిఁ బయనంబు సేసి
రయమున జయపురారణ్యంబుఁ జేరి
కోయలఱేనికిఁ గోరికి దెలిపి
అనునయం బెనయంగఁ బ్రార్థించినంత

భిల్లరా జాతని యుల్లంబు నెఱిఁగి
ఆదరంబునఁ జేర్చి యాతిథ్యమొసఁగి
దినములో నీ చుట్టఁగనినంత మేర
భూమి నీ కిచ్చెదఁ బొమ్మని పలికె.

మఱుసటి దినమున వఱువాత లేచి
పూర్వాబ్ధి యతివేలమై వెల్లివొడువఁ
బుడమిని జుట్టునప్పుడు కాఁపు మదిని
భావవీచిక లిట్లు ప్రభవింపఁ దొడఁగె.

# తృష్ణావర్తము

కామితార్థప్రదానైక కల్పవల్లి
మామక మనోఽంబుజాతభృంగీమతల్లి
అన్నపూర్ణమ్మ విమలదయామృతమ్ముఁ
జినుకునా నేఁటి కీ దీనజనునిమీఁద !

తరతరంబులనుండి నాతరముదాఁకఁ
బరమభక్తివిశ్వాసతాత్పర్యగరిమ
నేము కులదేవతల కిచ్చు నేటికోళ్ల
ఫలము నందెడువేళ సంప్రాప్తమయ్యె.

ధన్యమగు నింక జన్మ సార్థకత గాంచు
జీవితము వాంఛితార్థసంసిద్ధు లౌలయు
ధాన్యలక్ష్మియు ధనలక్ష్మి తమకుఁ దాము
నన్నుఁ జేరెదుకాల మాసన్న మయ్యె.

భాగ్యచక్ర నిరంతరభ్రమణమందు
నెన్ని మైదానములు దాఁటు నెన్ని శాద్వ
లస్థలంబులు గడచు ఫలప్రసూన
కలిత వనవీథు లెన్ని స్వాగతము లిడునో!

*

కష్టపడువారలు సుఖంబు గందు రనెడు
మాట లవి ప్రాఁతకాలపునాఁటి వయ్యె;
కష్టపడి నేఁడు సుఖములఁ గాంచు నెవఁడు?
భాగ్యమునఁగాదె సౌఖ్యసంపత్తి గనుట!

ఎండకన్నును నీడక న్నెఱుఁగఁబోని
సోమరులు సౌధముల మేలిసుకను లందఁ
జెలఁగి యోరంత ప్రొద్దులుఁ జెమటనూడ్చు
కష్టజీవికి గుడిసెలోఁ గాపురమ్ము.

సృష్టిగతిలో రహస్యంబు నెఱుఁగలేక
ఆశ కూడని దండ్రుడు వాజమ్మలెల్ల
రాశయే లేనిచో లోక మంతరించు
నాశయే కారణంబు సర్వార్థములకు.

నేల నాలుగు నెఱఁగుల నేలుచున్న
ధరణిధవులెల్ల రాశకు దాసు లగుచు
భయద పైశాచిక క్రియాపరత నుండఁ
దృప్తికిని, అస్మదాదుల కెంత దవ్వు!

*

విద్య గల్గిన సద్వచోవిభవ మున్న
శీలముండిన సద్గుణజాల మున్న
గౌరవంబున్న భుజవీర్యసార మున్న
ధనవిహీనుని మనికి వ్యర్థంబు జగతి.

అభ్యసించితి బాల్యమునం దొకింత
ఆంగిలేయము సంస్కృత మద్ది గౌణ
భాషగాఁ గొని, తెల్గుఁ గబ్బములతోడ
నే స్వముంగూడ నొకకొంత నెఱపినాఁడ.

ప్రకృతియంచును మధువంచుఁ బ్రణయమనుచు
విరహమంచును నిసియని వేదనయని
వివిధగతిభేదగీతికావిరచనమునఁ
బ్రకృతికవి పదవాచ్య గౌరవము గంటి.

భాస లెన్నిటఁ బాండితీప్రతిభఁ గాంచి
యెదలఁ గదలించు గీతిక లెన్ని వ్రాసి
యెన్నికళ లభ్యసించిన నేమి ఫలము ?
కాసులకు దాస్య మొనరించుఁ గడమయెల్ల.

పూవునకుఁ దేనెసోనలు పొలుపు గూర్చుఁ
గోకిలకుఁ బంచమంబు శోభాకరంబు
ఇంద్రచాపంబు తొడవు మేఘేందిరకును
ధనము మానవలోకజీవనము సొబగు.

*

బహుజనాకీర్ణ మస్మన్నివాస మేడ,
ప్రచురమృగమయ మీ మహారణ్య మేడ ?
ఎవరి కేనాఁటి కేనీటి ఋణము గలదొ,
తెలియఁగాఁనౌనె యెంతవారలకు నుంత ?

దున్నుకొన భూములే లేని బన్నమొకటఁ
గర్షకులు లభియింపని కష్టమొకట
యోచనంబున కందకయున్న దిట్టి
తారతమ్యంబునకుఁ గల కారణంబు.

*

పరుల కుపకార మొనరింపఁ బాటువడుట
ప్రాప్తమగు దానితోన సంతృప్తిగనుట
చింత లెఱుఁగక జీవించు టంతెకాని
మాయమర్మంబు లెఱుఁగరు కోయవారు.

కష్టపడి జీవనముసేయు కర్మయోగు
లాశల జయించఁజాలు మహామహితులు
అర్థిజన వాంఛిత ప్రదానైకనిరతు
లాటవికజాతి మహితసౌఖ్యానుభూతి.

ఈ మహాటవీసామ్రాజ్య మేలుచున్న
శబరులకు గర్వమన్న వాసనయు లేదు
తొత్తుపదవికె కన్నులు నెత్తికెక్కు
నాగరికులకు వీరి కేనాటిపోల్కి !

*

జయపురారణ్యసీమలు సారతమము
లచట వి త్తిన విత్తు గ్రామానై ఫలించు
నెన్నఁడును నుడివోవు లే యెఱుఁగరనుచు
వృద్ధు చెప్పినమాట నిబద్ధి యగును.

ఎవ్వఁ డా వృద్ధు ? మాయింటి కేల వచ్చె ?
నంతలో నంతపరిచయ మబ్బె నెట్లు ?
అతనికే యేల చెప్పితి నఖిలపితము ?
నంతయును నద్భుతావహ మగుచుఁ దోఁచు.

ఎన్ని దేశంబులను జూచె నింత కాతఁ
డెంత లోకానుభవము గడించినాఁడు !
మానవుం డని తోఁచదు మామకీన
భాగ్యదేవతయగఁ దలపంగ నగును.

*

తాతతండ్రులు నిత్యవ్రతంబుగాఁగఁ
బవలు రాతిరిఁ జెమటబిందువుల నోడ్చి
యించుమించుగ నిరువది యెకరములకు
మంచి మాగాణికొండ్ర గడించినారు.

తినియొ తినకయొ గడియింపఁగనిరి వార
లార్జితం బూర్జితస్థితి నందఁజేయ
నెన్నిపాటులు పడుచున్న నింతదనుకఁ
గ్రొత్తగా "సెంటు" కే నోచుకొనఁగ నైతి.

రోజురోజున కొక క్రొత్తరూపు దాల్చు
జీవనవ్యయమున కొక్క త్రోవలేదు
సంతతి యటన్న సుంత గొఱంతలేదు
ఎంతపండిన మిగులున దింతలేదు.

కారులును రేడియోల్ మున్నగాఁగ మేటి
భోగజాతంబు లవి లేకపోవుఁగాక !
కూడు గుడ్డలు తగుమాత్రఁ గూర్పఁ జాలి
బిడ్డలకు మంచివిద్య చెప్పింపఁ గలదె ?

అనుచుఁ జింతాపరంపరన్ మునుఁగుచున్న
నాదు ప్రార్థన మాలించినాఁడు దేవుఁ
డంచితైశ్వర్యములఁ గూర్ప నెంచినాఁడు
వృద్ధరూపాన సాక్షాత్కరించినాఁడు.

అన్ని వీథులు దాఁటి నా యున్నకడకుఁ
దనకుఁ దానయి యతఁడు రాఁ గనియె నెట్లు ?
అరమరికలేని సౌహార్ద మబ్బె నెట్లు ?
రోజు బాగున్న నెల్ల నీ యోజనుండు.

*

ఆ యరణ్యాని భయదమృగాకులంబు
బలుతెగుళ్లకు మనికి నెంజిలుల కునికి
దారిడొంకలు తెలియని దూరభూమి
మానవనివాసమునకుఁ గారాని చోటు.

అది మహామృత్యుగహ్వర మనిరి మిత్రు
లాపదల నిలయంబని రాష్ట్రులెల్ల
"మారభారం" బనిరి విన్నవారలంద
ఱింటియాబిడ దుఃఖ మింతింత గాదు.

ఎవ్వ రేమేమి యాంద్రుగా కేమి యనుచు
సాగివచ్చితి నిందాఁక సాహసించి
లిబ్బి తేరకుఁదేరఁ దా నబ్బుచుండఁ
బెడమొగముఁజూపు టెంతటి వెడఁగుఁదనము.

మృత్యుదేవత లేని చో పెద్దిగలదు,
పుట్టువొందిన దేయది గిట్టకుండుఁ?
జావునకు నోహటించి కష్టముల కులుకు
పందకన్నను జీవచ్ఛవంబు గలదె?

ప్రాణులకు నన్నిటికి నన్నదాన మొసఁగఁ
గంకణము గట్టుకొన్న విఖ్యాతి మాది
సాహసగుణంబటన్న మాజాతి సొమ్ము
గండుమీఱిన రైతుబిడ్డండ నేను.

'సాహసమె లక్ష్మి' యనిరిగా సర్వవిదులు
'యత్నమున సిద్ధి' యనునది ఆర్యసూక్తి
తినఁగఁ బెట్టఁగ నేర్చిన మనికి మనికి
పిటికిపందలు నేలకు బరువుమాత్ర.

సాహసంబున ముందుకు సాగిపోక
గూటిలోఁ గాళ్లు ముడుచుక కూరుచున్న
ఆంగిలేయులు విశ్వంభరాధిపత్య
పట్టభద్రులై నెగడంగ నెట్టు లబ్బు?

నాఁటికిని నేఁటి కింకొక నాఁటికేనిఁ
దెగువదారియె చరితను దీర్చిదిద్దు
ధైర్యశాలి మహోన్నతైశ్వర్యమందుఁ
బందలకు లేదు లోకమునందుఁ జోటు.

ప్రాగ్జననపుణ్యమున నిట రాక గంటి
భాగ్యలక్ష్మికృపాదృష్టిఁ బడయఁగంటి
ఆటవికుల సుస్వాగత మందుకొంటిఁ
గోర్కులన్నిటిఁ బండించుకొనఁగ నుంటి.

*

అతిథిపూజ వృథాపోవదంద్రు బుధులు
ఇచ్చినది వేమడుంగులై వచ్చునంద్రు
ముసలియాతని కాతిథ్య మొసఁగు ఫలము
తోనతో నెకగుణమయి తోఁచె నిపుడె.

భానుబింబంబు పొడుపుగుబ్బలి శిరమునఁ
బొటమరించిన నిముసంబు మొదలుగాఁగ
వాసరములోన నేఁ జుట్టివచ్చునంత
భూమి నాయది యనెఁగదా బోయఱేఁడు.

ద్యుమణి తొలుసంజ కెంజాయ దొలఁగ విడిచి
వెండిపువ్వులఁ బ్రకృతి కర్పించుకొనుచు
రెండు జారల దివిఁ బ్రాకుచుండె నాకు
జరుగ దీ బాట రెండు యోజనము లేని.

మానసమునకుఁ గలుగు నుత్థానజవము
నం దొక శతాంశమే సహస్రాంశమేనిఁ
గోటి కోట్యంశమే నొనగూర్పఁడేల
పాదముల కీ యనంత విశ్వప్రణేత ?

కార్యమునకయి ప్రేరేచు కరణమునకు
నిస్తులజవంబు నద్దాని నిర్వహింపఁ
గారణములగు తక్కు నంగముల కింత
జడిమనుం గూర్చు బ్రహ్మ ధీజడుఁడు గాఁడె !

సూర్యభగవానుఁడా ! నీకు జోతలివిగో
ఆలసింపుమ నేఁడు రవ్వంతసేపు
ఆశ్రితజనావనంబు ముఖ్యంబటంచు
దివ్యమూర్తికి వేఱ నేఁ దెలుపవలెనె !

ఆతపమునకు యౌవన మంకురించి
ఆత్మ తేజంబు దిక్కుల నాంచికొనంగ
స్వేదబిందుల లిఖియించు విజయగీతి
యాము మొక్కటి కడచనునట్లు దోంచు.

*

ఎవరు విత్తిరి నీరంబు లెవరు పోసి
రెవ్వరు కడంగరీయాది మృగచయముల
బారిఁ బడకుండఁ గాచి రీ పాదపముల
నంతయుః బ్రకృతిమాత మాహాత్మ్యమెకద.

భూమిసారమొ నీరంబులో మహిమమొ
గాలిగుణమొ మఱింకేమి కారణంబొ
ఈ వనస్పతులెల్లను వేవిధముల
మంటికిని మింటి కైక్యసంపద ఘటించు.

విపినదేవతాకోటులు విశ్రమింపఁ
దీర్చి కూర్చిన చల్వపందిళ్లు నాఁగఁ
గారుకొని దట్టమై యిరుల్ గ్రమ్ముచున్న
యీ తమాలతరుచ్ఛాయ లెంత హాయి.

మోకు దిరుగని పెనుపగు మూలములును
ఆకసంబంటు నుచ్చ్రతరాగ్రశిఖలు
వఱపు మీఱెడు శాఖానిబంధనములు
ఆమ్రతరుకోటి వనలక్ష్మి హర్మ్యవాటి.

ప్రకృతి శోభావళికిఁ జిరావాసగృహము
సహజసంపదలకు నెల్ల జన్మభూమి
సార సుక్షేత్రములకు నాస్థానసీమ
భాగ్యముల పేటి యీ వనవాటి తలఁప.

పూచె నొక కొన్ని కాయలు గాచెఁ గొన్ని
ముదిరినవి కొన్ని యారంగ ముగ్గెఁ గొన్ని
ఋతువిభేదంబు లెఱుఁగ దీ వృక్షరాజి
వీటిఁబోవుటయన్న దేనాఁట లేదు.

సంతతచ్ఛాయలొలయు వృక్షములు గలవు
బహువిధఫలాఢ్యములు పాదపములు గలవు
దారుకరణోచితమ్ములు తరులు గలవు
అన్నియును గల విట లేకయున్న దేమి?

నవనవగ్రాస కబళనోత్సవము లెసఁగ
హరిణసంతతి కామెత లందఁజేయు
సలలిత విశాల శాద్వలస్థలము లెన్నొ
కనుల కలిమికి సార్థక్యకలన నెఱపు.

మహితపల్లవసుమఫలమంజులంబు
చారుపుష్పాసవామోదపూరితంబు
వివిధవిహంగావళీగానవిలసనంబు
కవుల కీ వని భావనాకల్పకంబు.

నృత్తగతుల వినోదించు నెమ్మికోలము
పరభృత మ్మాలపించెడుఁ బంచమంబు
విరిసెఁ గీచకవనముల వేణుగీతి
భావుకున కింతకన్నఁ గావలయు నెద్ది.

కోరుకొన్నంతఫలముఁ జేకూర్చుకొనఁగ
వలసినంతటి మేలి భూవసతి గలదు
కృషికి ననువైన వనరు లెన్నేని గలుగు
రైతుజనముల కిది మనోరథఫలంబు.

వట్టివేళులుఁ బునుఁగు జవ్వాది మఱియుఁ
గమ్మకస్తురి గంధసారమ్ము లనఁగ
భోగ్యవస్తువులకుఁ బుట్టుభూమి యిద్ది
వణిజులకు నెన్నఁదగిన యాపణముగాదె?

పరుసవేదులు మున్నుగాఁ బసరు లుండు
దివ్యసంజీవనౌషధీప్రతతు లుండు
ప్రచురమహిమాఢ్యములు సిద్ధరసము లుండు
ప్రకృతివిలసనములకుఁ దావలము వనము.

కలవు జలములు ఫలములుఁ గలవు కుళులు
గలవు నివ్వరు లిధ్మముల్ గలవు ఛాయ
లాశ్రమోచితధర్మము లన్నిఁ గలవు
మునిజనావాసయోగ్యమై పొలుచు నెలవు.

యోగులకు మానసానందయోగదాయి
సిద్ధులకు వాంఛితార్థ సంసిద్ధికరము
సాధకుల కిది నైష్ఠికధా సాధనంబు
ఐహికాముష్మికముల సమన్వయ మిది.

*

హృదయమున భావవీచిక లెసఁగుకొలఁది
నడకలోపల నొక యింతజడిమ పొసఁగు
హృదయభావంబు లొక్కింత కుదియఁ జేసి
జవము మీఱంగ ముందుకు సాగు టురవు.

తనరి పండ్రెండురూపులు దాల్చినట్లు
చండభానుండు వెలుఁగుఁ బ్రచండరీతిఁ
బాదపంబులు తమనీడ నూఁది నిలుచు
నట్టమధ్యాహ్నసమయ మన్నట్లు దోఁచు.

అగ్నిశిఖల వెలార్చెడు నాతపంబు
చెవులనుండి బయల్వెడు సెగలు పొగలు
కుండలో వండినట్టుల నుండు మేను
ప్రకృతి వహ్నిమయంబుగాఁ బరిణమించె.

ఆఁకలియు నీరువట్టు రవంత దోఁచు
హృదయమున నేదొ పరితాప మొదవ సాగె
ఫలములం దిని జలము లాప్యాయనముగఁ
గ్రోలి యొక్కింత విశ్రాంతిగొనుట యురవు.

*

జరిగిపోయిన కాలంబు తిరిగిరాదు
నేఁడు కడచన్న మఱి యిట్టినాఁడు రాదు
ఆకలిం దప్పియుం గొనకేక ధాటి
సాగిపోవలె సుంత విశ్రాంతి గొనక.

చేతికందు ఫలంబుఁ బ్రాశించుచుందుఁ
గ్రుక్కెఁడు జలంబు లెటనేనిఁ గ్రోలనగును
జిరమనోరథసంపూర్ణసిద్ధి యొసఁగ
నొక్కనాఁటికి క్షుత్తృష్ణ లోర్వఁదగదె.

*

నిద్దమగు నల్లరేగడ నేల లివ్వి
యిచట విత్తినఁ బండనిదేమి గలదు
పసుపు మున్ను వాణిజ్యపుం బంటల కనఁ
బెట్టినది పేరు రేగడ మెట్టపొలము.

అసలయిన చేవ గలది యీ మసకభూమి
దున్నకయపండు నిచ్చోట జొన్న, సజ్జ,
కంది, పెసరయు మున్నుగాఁగలుగువంట
లెంతలేదన్నఁ బుట్టియొా నెకరమునకు.

కండగలిగిన వీ వంచ గరువులెల్ల
సారముగలట్టి దీ యెట్టిచారనేల
పంటలకుఁ బేరుగన్న దీ ప్రాంతమంత
నూసరక్షేత్ర మన్న దీయూర లేదు.

తెల్లకీవంచనేల యీ పల్లమెల్ల
శాలిసస్యంబులకు నిది మేలిగుణము
నాటువేసిన మఱుసటినాఁటినుండిఁ
బూఁట కొకవన్నెఁ బెఱుఁగు నిచ్చోటి పైరు.

వానకారునఁ గల కొండసోనలెల్ల
ననువుమీఱంగ నొక్కచో నాహరించి
సలలితవిశాలముగ జలాశయముఁగూర్ప
మాఱు నిచ్చోటు మంచి కేదార మగును.

వాగు వంచలఁ జేరిన వండమట్టి
పైరులకుఁ బంటలకుఁగూడఁ బేరుగలది
ఎన్ని యేండ్లైనఁ జిట్టెడు నెరువులేక
యేకరీతిగ ధాన్యలక్ష్మిక మగును.

ఒక్కటి నధఃకరించు నింకొక్కపొలము
పండ్లు పులియించు నుర్వరాప్రాంతమంత
పది గొననగు విడువనొ నేది యిందు
అక్కటా! దాపురించె సాయంసమయము.

*

ఎన్నఁదగిన పశుగ్రాస మున్న దిచట
నిలుచుటకు నీడ త్రాగంగ నీరు గలదు
లేదు మృగభీతి వనదంశబాధ లేదు
పసికి నన్నిటఁ దగు మంచి వసతి యిద్ది.

పాఁడిమొదవు లిచ్చోఁ దిరుగాడుమాత్రఁ
బీవరోధ్నులై క్షీరముల్ పిదుకఁజాలు
బక్కచిక్కి లేవఁగలేని దుక్కిటెద్దు
చియ్యవట్టి పోతరమునఁ జెంగలించు.

పాఁడి గల్గును మఱి పశుపాళి గల్గు
మెండుగా సర్వధాన్యసమృద్ధి గలుగు
నేర్పుమీఱ వాణిజ్యంబు నెఱపికొన్న
నెంతయేని ధనంబు గడింపనగును.

*

దివసలక్ష్మికి వార్ధక మవతరించె
నాతపమున కొకింత సౌమ్యత ఘటిల్లె
నింతదనుకను బూర్ణవిశ్రాంతి గొనిన
ప్రాణికోటుల కుత్సాహపటిమ మించె.

యామములు మూఁడు కడచిన వంతిమమునఁ
గూడ నొకకొన్ని ఘటికలు కొఱఁత వడియె
అన్నిరోజులవలెఁ గాక యంతలోన
నింతగా సాగిపోయినదేమి నేఁడు.

వేఁడివేలుపు నేఁ డేమొ వేగవేగ
నడచిపోవుచు నున్నట్లు లెడఁదఁ దోఁచుఁ
గాలచక్రంబు బిఱబిఱ గడచిపోవు
నేమి మునిఁగెను దీనికి నీ దినాన.

*

పాఁడి పంటలె కాక యీ ప్రాంతమందుఁ
గాననంబున లభియించు తేనె మొదలు
ఎన్నియే వస్తువుల సేకరింపనగును
అమ్మఁగానగు నన్యదేశమ్ములందు.

సాలతరువులు మద్దివృక్షములు టేకు
బ్రూఁకులును నింక దారుకర్మములకైన
యీ మహాభూజముల నమ్మి యేకపేాల
గా గడించెద ధనము లెక్కకును మిగుల.

*

చేత డబ్బున్నఁ గొండపై కోతి వచ్చు
విత్తమున లభియింపని విభవ మున్నె ?
అర్థవంతున కబ్బు సర్వార్థములును
దథ్యముగ ధనమూల మిదం జగత్తు.

అప్రవేశ్య మీ భయదాటవీప్రదేశ
మపుడు నందన సుందరోద్యాన మగును
బీడువడి యున్న యీ వనవీథులెల్లఁ
బైరుపచ్చల మదికి సంబరము గొలుపు.

అనుపమాభోగ మఖిల సౌఖ్యాస్పదంబు
సర్వవస్తుసమృద్ధంబు శాంతినిలయ
మతుల శిల్పవిశేష విన్యాసకంబు
భవన మొక్కటి వెలయింపవలయు నిచట.

పాకశాలలు మఱి స్నానపానశాల
లతిథి కభ్యాగతికి ననువైన వసతు
లన్నియును దగురీతుల నలరఁజూతు
నర్థములు భోగమునఁ జరితార్థము లగు.

అన్నివిధముల రక్షణకయి విశాల
మతిశయోత్తాలమగు సాల మది హితంబు
పసికి గోష్ఠంబుఁ గృషికైన పరికరంబు
లుంచుటకుఁ దగు నిరవుఁ గల్గించు టురవు.

పొదలు నఱుకంగ భూములఁ జదును సేయఁ
గనిమలను దీర్ప దున్ని విత్తనముఁ జల్ల
పైరు కోయంగ నూర్పంగఁ బలువిధముల
యంత్రముల సేకరించు టత్యంతహితము.

పంటలకు ననువగు వెల పలుకుదనుక
మూషికాదుల నష్టముల్ పొరయకుండ
భద్రముగ దాఁచి వానిఁ గాపాడుపొంటె
వలసినన్ని ధాన్యాగారముల ఘటింతు.

దుర్గమారణ్యభూముల త్రోవలెల్ల
నాఁటికిని నాఁటికిని రాచబాట లగును
భయదహింస్రాకులంబు లీ పరిసరములు
జనపదములై సుఖావాససదనము లగు.

పయనములకును, వస్తుసంచయము నిటకుఁ
దెచ్చుటకు నన్ని యెడలకుఁ బుచ్చుటకును
కారులును, బస్సులును నింకఁ గలుగు నేఁటి
యానసాధనములను సమాహరింతు.

భవ్యవిజ్ఞాన మహిమానుభావితములు
అద్యతనజీవనక్రియాభ్యర్హితములు
మానితసుఖానుభూతిసంధానకములు
నూత్నవస్తులు గూర్పంగ యత్నమొప్పు.

పాఠశాలలు విపణులు వైద్యశాల
లాధునికములు వివిధయంత్రాలయములు
తతవినోద వైజ్ఞానికోన్నతులు వెలయఁ
బట్టణములగుఁ బరిపాటిఁ బక్కణములు.

కాలపురుషున మోఘసంకల్పమహిమ
పండి నిండిన యీ స్థలవైభవంబు
నేకమై నిత్యనూతనోత్సేకమెనయ
నెన్ని చిన్నెలు మెఱయునో యింక నిచట.

*

పవలు నాలుగుజాములు పయనమునను
విసివి వేసారినట్టుల విశ్రమింప
నరుగుచున్నాఁడు పశ్చిమాశాంతసౌధ
వీథికిన్ మెల్లమెల్లన వేవెలుంగు.

కాళ్లు తడఁబడు గాత్రంబు కంపమందుఁ
జెవులు గడియలువడుఁ జూపు చెదరసాగు
నడుగువేయుట భారమన్నట్లు దోఁచు
సాగు టెఁక నెట్లు సాగక యాగు టెట్లు?

ఒక్కనాఁటి కష్టంబున కోర్చికొన్నఁ
దరతరాలుగ సౌఖ్యముల్ పరిఢవిల్లు
నెట్టులేఁ గొంతమేర గమింతమన్న
బొత్తిగాఁ బ్రాణ మొక చిన్న మెత్తు లేదు.

ఎంతదూరము నడచితి నెంత మేర
నాఁచికొంటినో తెలియంగ ననువుపడఁగఁ
గొండలును గుట్టలును వాగు లుండుచోటు
లెల్లలుగ గుఱుతుంచితి నెల్లకడల.

తరణి పడమటికొండకుఁ దరలిపోవు
సంజకెంజాయ దిక్కుల జాలువాఱు
నెట్టయెదుటను గల చిన్న గుట్ట నెక్కి
తేఱిచూచెదఁ జుట్టిన మేరయెల్ల.

సత్త్వహీనతఁజేసి యీ శైలకంబు
నధివసించుట దుస్సాధమైె తనర్చె
మెల్లఁగాఁ బ్రాఁకి కొండపై నల్లఁ జేరి
అనుభవింతు నిరంతరానంతసుఖము.

కొండపైఁ జేరుటయె పెద్దగండమయ్యె
నిలువగల్గినమాత్రమేన్ బలములేదు
తేఱిచూడఁగలంతటి దిటవు సున్న
అవశములు శీర్ణములు నఖిలాంగకములు.

విశ్వమును దనదీప్తుల వెలుఁగఁజేసి
అస్తమించినవాఁ డిదే యహిమకరుడు
కష్టపడునాతఁడు సుఖింపఁగలుగునట్టు
లస్తమించినవాఁ డుదయంబు నందు.

స్వైరవీరవిహారంబు సలుపుపొంకె
నన్నిదిక్కులఁ జీఁకటు లలముకొనియె
వన్యమృగములు భయదారవంబు లెసఁగ
నెల్లెడలఁ దామయై వనమెల్ల నిండె.

చీఁకటులు గ్రమ్మె దేహంబు శిథిలమయ్యె
నేఁటి కిచ్చోటనే శయనించు టురవు
చేపకడ లేచి బోయలఁజేనిఁ గాంచి
యెంచికొనియెద నా చుట్టినంత భూమి.

.... .... .... .... ....

చిరమనోరథసిద్ధి చేకుఱునటన్న
కాంత లవియెల్లఁ గలలయి కానుపింప
అతిథి యాకాపు దీర్ఘనిద్రానురక్తి
నందఁగల్గె నిరంతరానందగరిమ.

.... .... .... .... ....

జలధివలయిత మేదినీశ్వరుల కేని
వలయునది యేడుజేనల వసుధమాత్ర
మింత యెఱిఁగియుఁ దృప్తి యావంత లేక
పుడమికయి మందబుద్ధులు పోరుచుంద్రు.

ఉన్నదానితో సంతృప్తినొందలేక
వచ్చినాఁ డిచ్చటికిఁ జుట్టివచ్చినాఁడు
కాననంబెల్ల క్షుత్తృష్ణలైనఁ గొనక
యెంతభూమినిఁ దుద కాక్రమింపఁగలిగె !

తృప్తికన్నను సౌఖ్య మింకేమి గలదు
ఆపదలమూల మింకెద్ది యాసకన్న
మృత్యు వన నేది యతిసంచయేచ్ఛకన్న
ననుచు భిల్లులు తమలోన నాడుకొనిరి.

*      *      *      *      *      *

ఆశ లేక లోకయాత్ర సున్నకు సున్న
ఆశ లేక కలుగ దభ్యుదయము
అవధిమీఱు నాస ఆపన్నిదానంబు
అవధిమీఱంబోని యాస సుఖము.

ఆశ లేక కాద యత్యాశయునుగాద
ఉచితమైనపట్టు నుండు టొప్పు
పరిమితంపుటాస పరమసౌభాగ్యంబు
పెరుటాస పతనకారణంబు.

ఆశ సాహసంబు త్యాగంబు రాగంబు
మితములైనయపుడు మేల్మిఁగూర్చు
మితపదంబుమీఱి అతిపదంబున్ జేర
దుఃఖదములు విబుధదూష్యము లగు.